పుణ్యకర్మలను చేసినవారు నన్ను సేవింతురు. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞా
అని వారు నాల్గు విధములుగా ఉందురు. వీరు అందఱు ఉదారులే. కాని జ్ఞాని ఆత్మయే
అతడు యోగము నవలంబించి పరమగమ్యమైన నన్ను పొందుట
పూనుకొనియుండును. అనేకజన్మలయొక్క సంస్కారములవలన తుదకు జ్ఞానమున
సంపాదించినవాడు "సర్వము వాసుదేవుడే" అని నన్ను తన స్వరూపమునుగ
పొందుచున్నాడు. అట్టి మహాత్ముడు మిగుల దుర్లభుడు.

తమ స్వభావములకు అధీనులై జనులు, ఆయాకోరికలు తమ వివేకమున
హరించుచుండగా, వానిని పొందుట కొఱకు ఇతరదేవతలను ఆ యా నియమములతో
భజించుచున్నారు. ఏ యే భక్తుడు ఏ దేవతారూపమును శ్రద్ధతో అర్చింపగోరుచున్నాడ
ఆ యా వ్యక్తులకు దృఢమైన శ్రద్ధను నేనే కలిగించుచున్నాను. ఆ శ్రద్ధతో వాడు
దేవతను ఆరాధించుచు, ఆ దేవతామూర్తినుండి, నాచేతనే అభీష్టములన
పొందుచున్నాడు. అల్పమైన ప్రజ్ఞ కలిగిన యాదేవతారాధకులకు కలుగుఫలమ
శాశ్వతమైనది కాదు. దేవతలను ఆరాధించువారు ఆదేవతలనే పొందుదురు. నా భక్తుల
నన్నే పొందుదురు. పుణ్యకర్మలు చేయుచు నుండగా ఎవరియొక్క పాపము అంతమ
నొందుచున్నదో వారు ద్వంద్వమోహనిర్ముక్తులై దృఢవ్రతులై నన్ను భజింతురు".

శ్లో॥ మనుష్యాణాం సహస్రేషు కశ్చి ద్యతతి సిద్ధయే
యతతా మపి సిద్ధానాం కశ్చి న్మాం వేత్తి తత్త్వతః॥ 3

శ్లో॥ భూమి రాపో ఽ నలో వాయుః ఖం మనో బుద్ధి రేవ చ।
అహంకార ఇ తీయం మే భిన్నా ప్రకృతి రష్టధా॥ 4

శ్లో॥ అప రేయ మిత స్త్వన్యాం ప్రకృతిం విద్ధి మే పరామ్।
జీవభూతాం మహాబాహో య యేదం ధార్యతే జగత్॥ 5

శ్లో॥ ఏత ద్యోనీని భూతాని సర్వాణీ త్యుపధారయ।
అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రళ యస్తథా॥ 6

శ్లో॥ మత్తః పరతరం నాన్య త్కించి దస్తి ధనంజయ।
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ॥ 7

శ్లో॥ త్రిభి ర్గుణమయై ర్భావై రేభి స్సర్వ మిదం జగత్।
మోహితం నాభిజానాతి మా మేభ్యః పర మవ్యయమ్॥ 13

శ్లో॥ దైవీ హ్యేషా గుణమయీ మమ మాయా దురత్యయా।
మా మేవ యే ప్రపద్యన్తే మాయా మేతాం తరన్తి తే॥ 14

శ్లో|| చతుర్విధా భజన్తే మాం జనా స్సుకృతినో అర్జున |
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీ చ భరతర్షభ || 16

శ్లో|| ఉదారా స్సర్వ ఏ వైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ |
ఆస్థిత స్స హి యుక్తాత్మా మా మే వానుత్తమాం గతిమ్ || 18

శ్లో|| బహూనాం జన్మనా మంతే జ్ఞానవా న్మాం ప్రపద్యతే |
వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః || 19

శ్లో|| కామైస్తై స్తై ర్హృతజ్ఞానాః ప్రపద్యన్తే ఽన్యదేవతాః |
తం తం నియమ మాస్థాయ ప్రకృత్యా నియతా స్స్వయా || 20

శ్లో|| యో యో యాం యాం తనుం శ్రద్ధ యార్చితు మిచ్ఛతి |
తస్య త స్యాచలాం శ్రద్ధాం తా మేవ విదధా మ్యహమ్ || 21

శ్లో|| స తయా శ్రద్ధయా యుక్త స్త స్యారాధాన మీహతే |
లభతే చ తతః కామాన్ మయైవ విహితాన్ హి తాన్ || 22

శ్లో|| అంతవ త్తు ఫలం తేషాం త ద్భవ త్యల్ప మేధసామ్ |
దేవాన్ దేవయజో యాన్తి మద్భక్తా యాంతి మా మపి || 23

శ్లో|| యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణామ్ |
తే ద్వంద్వ మోహవినిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః || 28

శ్రీ మహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 31

## విజయప్రభ

భగవద్భక్తులు అన్యదేవతాభక్తులు అని భక్తులు రెండువిధములుగా ఉన్నారు. భగవద్భక్తులు సకలఫలములకొఱకు భగవంతునిపైననే ఆధారపడి యుందురు. ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని అని వీరు నాలుగువిధములుగా నుందురు.

శత్రువులు చుట్టుముట్టుట, భీకరములైన క్రూరమృగములు పైబడునుండుట మొదలైన పెద్దయాపదలలో, భయంకరములైన వ్యాధులు వచ్చిపడినప్పుడు తీవ్రములైన భయదుఃఖములను పొందినవాడు ఆర్తుడు. 'ఆ భయదుఃఖములను వారించుటకు 'ఈలోకములోని వారు కాని, ఇతర లోకములలోని దేవతలు కాని సమర్థులు కారు ; పరమేశ్వరు డొక్కడే నన్ను రక్షింప గలడు' అని వారు భగవంతునే ఆశ్రయింతురు.' మొసలిచే ప్రాణసంకటము నొంది పరమేశ్వరుని శరణు పొందిన గజేంద్రుడు ఇట్టివాడే.

తెలిసికోవలయు నను ఇచ్ఛ జిజ్ఞాస. ఈ జగత్తు కంతకు మూలమైన తత్త్వమే
పరమేశ్వరు డెవ్వడు అని తీవ్రమైన జిజ్ఞాస కలిగి అందులకై భగవంతునే ఆశ్రయించు
భక్తుడు జిజ్ఞాసువు. చతుర్ముఖుడు చిరకాలము భగవంతునిగూర్చి తపస్సు చేసి, ఆయన
ప్రత్యక్ష మైనప్పుడు ఆయనను చూచి "దేవా ! నీవే పరమేశ్వరుడవా, లేక నీకంటె
నధికుడైన వాడు ఇంకెవడైన గలడా" అని ప్రశ్నించెను. అట్టివాడు జిజ్ఞాసువు.

ఈ లోకములో సంపన్నత మహారాజపదవులు మొదలగువానిని కో
భగవంతుని ఆశ్రయించువాడు అర్థార్థి. సవతి తల్లివలన అవమానమును పొంది
మహాపదవిని కోరి భగవంతునిగూర్చి పెద్ద తపస్సు చేసిన ధ్రువుడు ఇట్టివాడు.

వారము దినములలో మిగుల దయతో భగవంతుని లీలా విశేషములన
పరీక్షిత్తునకు బోధించిన శుకుడు జ్ఞాని.

వీరందఱను ఉదారులే. మహాత్ములే. కాని జ్ఞాని మాత్రము తన యాత్మన
సకలభూతములయందును అంతర్యామిగా నున్న భగవంతునిగా తెలిసికొనుచున్నాడ
అట్టివాడు భగవంతుని పొందుటకు ప్రయత్నింప నక్కఱ లేదు. కాని ఆర్తుడు, జిజ్ఞాసువు
అర్థార్థి అను ముగ్గురును భగవంతునే శరణమును పొంది ఆయననే స్మరించుచు అనే
జన్మములు గడచిన తరువాత, "ఈ జగత్తు అంతయు వాసుదేవుడే" అని శుకమహర్షి వలె
తన్మయత్వముతో నుందురు.

సాధారణ జనులు అనేక కోరికలతో, భగవంతుని ఆశ్రయింపక, ఇతరదేవతలన
ఆశ్రయించి, కోరికలను పొందుటకై పూజలు, జపములు మొదలుగా ఎన్నో విధములన
అవలంబించి ఎంతో శ్రమపడుదురు. దానివలన తాత్కాలికములైన ఫలములను పొంది
కొలదిగా సంతోషమును పొందుచుందురు. వారి కా భక్తిని ఆదేవతల పూజలయంద
శ్రద్ధను భగవంతుడే కలిగించి వారు కోరుచున్న యాఫలములను కూడ
ఒసంగుచున్నాడు. ఆఫలములు త్వరలో ముగిసిపోవును. అల్పమైన తెలివిగలవార
మరల ఇతరఫలముల కొఱకు ఇతర దేవతలను ఆశ్రయించుచుందురు. ఇట్లు వారి
సంసారము కొనసాగుచుండును.

ఇట్టి భక్తులలో ఎవరియొక్క పాపము పుణ్యకర్మలవల్ల అంతము నొందున
అట్టివారు సుఖదుఃఖాది ద్వంద్వముల నుండి ముక్తులై ఇతర దేవతలను వీడి దృఢముగ
భగవంతునే భజింతురు.

శ్రీరాముడు శ్రీకృష్ణుడు మొదలగువారిని పరమేశ్వరులనుగా (Supreme God
కాక మంత్రాధిష్ఠానదేవతలనుగా సీతావల్లభునిగానో ఆంజనేయవరదునిగానో
శ్రీకృష్ణుని యశోదానందనుని గానో, రాధావల్లభుని గానో పరిమితములైన
యాకారములతో ధ్యానించువారు అన్యదేవతా భక్తులే యగుదురు. వారిచ

భావింపబడుచున్న ఆదేవతామూర్తుల రూపముల ద్వారమున కూడ పరమేశ్వరుడే వారి కోరికలను దీర్చుచుండును. పాశుపతాస్త్రముకొఱకు అర్జునుడు ఆరాధించిన ఈశ్వరుడు అన్యదేవతయే. ఒకదేవుని విషయముననే ప్రసన్నాంజనేయుడు వీరాంజనేయుడు, మహాగణపతి, విఘ్నేశ్వరుడు మొదలుగా భిన్న దేవతామూర్తులను ధ్యానించువారు అన్యదేవతా భక్తులే యగుదురు.

## (ii) బ్రహ్మలోకగమన చమసము

## గీత

పరమాత్మయైన తన్ను ఉపాసించువారికి, ఇతర దేవతలను ఉపాసించువారికిని కలుగు ఫలమునందు గల యంతరమును భగవంతుడు ఇట్లు వివరించుచున్నాడు. "మరణసమయమున నన్నే స్మరించుచు శరీరమును త్యజించువాడు నా భావమునే పొందుచున్నాడు. ఇందులో సందేహము లేదు. ఎవ డెవడు ఏ యే భావమును ఎల్లప్పుడు చింతించుచు, మృతినొందు నప్పుడు కూడ స్మరించుచు, దేహమును వీడునో వాడు ఆ భావమునే పొందును. కావున అర్జునా, నాయందు మనస్సును బుద్ధిని ఉంచి సర్వకాలములందును నన్ను స్మరించుచుండుము ; యుద్ధమును కూడ చేయుము. నన్నే పొందగలవు. సంశయము లేదు.

మనస్సును మఱియొక విషయము పైకి పోనీయక అభ్యాసముచేత దృఢమైన యోగముతో ధ్యానించుచు యోగి పరమపురుషుని పొందుచున్నాడు. మరణకాలమునందు భక్తితో యోగబలముచేత నిశ్చలమైన మనస్సుతో అతడు కనుబొమల మధ్య ప్రాణమును చక్కగా ప్రవేశపెట్టి ఇంద్రియములను అన్నింటిని నిగ్రహించి మనస్సును హృదయమున స్థిర మొనరించి ప్రాణమును మూర్ధమునకు చేర్చి నిలిపి నన్ను స్మరించుచు బ్రహ్మమునకు వాచకమైన ఓంకారమును ఉచ్చరించుచు శరీరమును వీడ్కొని పోవువాడు పరమమైన గతిని పొందుచున్నాడు.

ఏకాగ్రమైన చిత్తముతో నిత్యము సతతముగా నన్ను స్మరించు యోగికి నేను సులభముగా పొందదగిన వాడను అగుదును. నన్ను చేరి పరమమైన సంసిద్ధిని పొందిన మహాత్ములు అశాశ్వతము దుఃఖములకు నిలయమును అయిన పునర్జన్మను పొందరు. బ్రహ్మ భువనముతో కూడ సకలలోకములలో ఏ లోకము నకు పోయినను మరల తిరిగి రావలసినయే యుండును. నన్ను పొందినప్పుడు మాత్రమే పునర్జన్మ యుండదు.

యోగులు ఏమార్గమునందు పోయినచో మరల తిరిగిరారో, ఏమార్గమునందు పోయినచో తిరిగివత్తురో చెప్పెదను. అగ్ని, జ్యోతిస్సు, అహస్సు, శుక్లపక్షము, ఆఱుమాసముల యుత్తరాయణము, కల మార్గమునందు పోయిన బ్రహ్మవేత్తలు బ్రహ్మమును పొందుదురు. ధూమము, రాత్రి, కృష్ణపక్షము, ఆఱుమాసముల

దక్షిణాయనము, గల మార్గమునందు పోయిన యోగి అచ్చట చాంద్రమసమైన జ్యోతి పొంది తిరిగివచ్చును. శుక్లము, కృష్ణము అను ఈ రెండు మార్గములు జగత్తునంద శాశ్వతమైనవి. ఒకదానిచేత అనావృత్తి, మఱియొక దానిచేత ఆవృత్తి కలుగును. ఈ రెండ మార్గములను ఎఱింగిన యోగి ఎవ్వడును మోహమును పొందడు. కావున అర్జునా! నీవు అన్ని వేళలయందును యోగయుక్తుడవై యుండుము. వేదములు యజ్ఞములు తపస్సు దానములు అనువానియొక్క అధ్యయనానుష్ఠానములవలన ఏయే ఫలము కలుగు న శాస్త్రము నిర్దేశించినదో ఆఫలసముదాయమును సర్వమును అతిక్రమించి, దీని తెలిసికొన్న యోగి పరమైన స్థానమును పొందుచున్నాడు".

శ్లో॥ అంతకాలే చ మా మేవ స్మరన్ముక్త్వా కళేవరమ్ ।
యః ప్రయాతి స మద్భావం యాతి నా స్త్యత్ర సంశయః ॥ 5

శ్లో॥ యం యం వాపి స్మర న్భావం త్యజ త్యంతే కలేవరమ్ ।
తం త మే వైతి కౌంతేయ సదా తద్భావ భావితః ॥ 6

శ్లో॥ తస్మా త్సర్వేషు కాలేషు మా మనుస్మర యుద్ధ్య చ ।
మ య్యర్పితమనో బుద్ధి ర్మా మే వైష్య స్యసంశయః ॥ 7

శ్లో॥ అభ్యాసయోగ యుక్తేన చేతసా నాన్యగామినా ।
పరమం పురుషం దివ్యం యాతి పా ర్థానుచింతయన్ ॥ 8

శ్లో॥ ప్రయాణకాలే మన సాచలేన భక్త్యా యుక్తో యోగబలేన చైవ ।
భ్రువో ర్మధ్యే ప్రాణ మావేశ్య సమ్యక్ స తం పరం పురుష ముపైతి దివ్యమ్ ॥ 10

శ్లో॥ సర్వద్వారాణి సంయమ్య మనో హృది నిరుధ్యచ ।
మూర్ధ్న్యాధా యాత్మనః ప్రాణ మాస్థితో యోగధారణామ్ ॥ 12

శ్లో॥ ఓ మి త్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్ ।
యః ప్రయాతి త్యజన్ దేహం స యాతి పరమాం గతిమ్ ॥ 13

శ్లో॥ అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః ।
త స్యాహం సులభః పార్థ నిత్యయుక్తస్య యోగినః ॥ 14

శ్లో॥ మా ము పేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతమ్ ।
నాప్నువన్తి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః ॥ 15

శ్లో॥ ఆ బ్రహ్మభువనా ల్లోకాః పునరావర్తినో ఽర్జున ।
మా ము పేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే ॥ 16

శ్లో|| యత్ర కాలే త్వనావృత్తి మావృత్తిం చైవ యోగినః |
ప్రయాతా యాన్తి తం కాలం వక్ష్యామి భరతర్షభ || 2

శ్లో|| అగ్ని ర్జ్యోతి రహః శ్శుక్లః షణ్మాసా ఉత్తరాయణమ్ |
తత్ర ప్రయాతా గచ్ఛన్తి బ్రహ్మ బ్రహ్మవిదో జనాః || 2

శ్లో|| ధూమో రాత్రి స్తథా కృష్ణః షణ్మాసా దక్షిణాయనమ్ |
తత్ర చాంద్రమసం జ్యోతి ర్యోగీ ప్రాప్య నివర్తతే || 2.

శ్లో|| శుక్లకృష్ణే గతీ హ్యేతే జగత శ్శాశ్వతే మతే |
ఏకయా యా త్యనావృత్తి మన్యయాఽవర్తతే పునః || 2(

శ్లో|| నైతే సృతీ పార్థ జానన్ యోగీ ముహ్యతి కశ్చన |
తస్మా త్సర్వేషు కాలేషు యోగయుక్తో భ వార్జున || 27

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 32

## విజయప్రభ

భగవానుడు ఈ సందర్భమున మూడు విషయములను వివరించుచున్నాడు మరణించుసమయమున తుదకు ఎవడు దేనిని భావించునో వాడు తరువాత ఆ భావమునే పొందును ; కావున భగవంతుని స్మరించుచు శరీరమును వీడు వాడు భగవంతునే పొందును. కాని అట్లు తుదిక్షణమున భగవంతుని స్మరణము కలుగ వలయు నన్నచో జీవితమున సదా ఆయననే ధ్యానించు చుండవలయును. ఆ ధ్యానముయొక్క బలమువలన తుదిక్షణమునందు భగవంతునే స్మరించుచు శరీరమును వీడిన యోగి భగవంతునే పొంది పునర్జన్మమును పొందడు ; అనగా ముక్తు డగును. ఇది మొదటి విషయము.

ఓంకారమును బ్రహ్మమునుగా ఉపాసించిన యోగి యోగబలముచేత మనస్సును హృదయమునందు నిరోధించి, మనస్సుతో కూడ ప్రాణమును హృదయమునందు నిరోధించి, మనస్సుతో కూడ ప్రాణమును హృదయమునుండి కనుబొమలమధ్యకు అక్కడ నుండి మూర్ధమునకు చేర్చి అక్కడ నుండి మూర్ధమును ఛేదించుకొని పోయి పరమగతిని పొందుచున్నాడు. పరమగతి అనగా మోక్షము. కాని ప్రణవమును బ్రహ్మమునుగా ఉపాసించువారు బ్రహ్మలోకమునకు పోయి అక్కడ చిరకాలము ఉండి, ఆలోకము ప్రళయమునందు అంతము నొందునప్పుడు, బ్రహ్మదేవునితో కూడ ముక్తిని పొందుదు రని ఉపనిషత్తుల యందు చెప్పబడి యున్నది. ఇది రెండవ విషయము.

ఈ బ్రహ్మలోక గమనముయొక్క ప్రాశస్త్యమును వివరించుటకే భగవంతు ఈలోకమునకు చేర్చు శుక్లగతిని గాక కృష్ణగతిని కూడ ప్రస్తావించినాడు. అగ్ జ్యోతిస్సు, అహస్సు మొదలుగా శుక్లమార్గమునందు, ధూమము, రాత్రి మొదలు కృష్ణమార్గమునందు పేర్కొనబడిన శబ్దములు ఆ యా దేవతల నామములు. వీ ఆతివాహికదేవత లందురు. అతివహన మనగా యాత్రికులను ఒక మజిలీ నుం మఱియొక మజిలీకి తీసికొనిపోవుట. ఈ దేవతలు తమస్థానమునకు చేరిన యోగుల అక్కడ నుండి పైస్థానమునకు చేర్చుచుందురు. అందువలన వీరు ఆతివాహికదేవత చెప్పబడుచున్నారు. వీరిలో అహస్సు రాత్రి మొదలుగా కాలములోని విభాగముల అభిమానించు దేవతలు అధికముగా నున్నారు. మామిడితోట అన్నప్పుడు దానియం మామిడి చెట్లు కాక ఇతర వృక్షములు కూడ కొన్ని యుండవచ్చును. మామిడి చె అధికముగా నుండుటచే దానిని మామిడితోట అని చెప్పుచుందుము. అట్లే వీనియం కూడ కాలము నభిమానించు దేవతలు అధికముగా నుండుటచే, అగ్నిజ్యోతిస మొదలగువారు కాలాభిమానిదేవతలు కాకపోయినను, శుక్లమార్గము ఉత్తరాయణమార్గమని, కృష్ణమార్గమును దక్షిణాయన మార్గమని పేర్కొనుచుందు

శుక్ల మనగా తెల్లనిది. కృష్ణ మనగా నల్లనిది. ప్రకాశవంతములైన విద్య, జ్ఞాన మొదలగునవి శుక్ల శబ్దము చేత సూచింపబడును. ప్రకాశహీనములైన అవిద కర్మపరత్వము మొదలగునవి కృష్ణశబ్దముచేత సూచింపబడును. బ్రహ్మము ఉపాసించువిధానములను బ్రహ్మవిద్యలందురు. అందువలన బ్రహ్మవిద్యోపాసకులై యోగులు బ్రహ్మలోకమును చేరుటకు ఏర్పఱుపబడిన మార్గము శుక్లగతి అ చెప్పబడుచున్నది. కర్మపరత్వమునకు కారణము అవిద్య. అందువల యజ్ఞయాగదానాదులచేత పుణ్యము నార్జించుకొన్న కర్మనిష్ఠ ఇంద్రచంద్రాదిలోకములను చేరుటకు ఏర్పఱుపబడిన మార్గము కృష్ణగతి య పేర్కొనబడినది.

ఈ మార్గములందు కాలాభిమానదేవతలు అధికముగా నుండుట బ్రహ్మోపాసకులు ఉత్తరాయణమునందే పగటికాలముననే మరణింతురని కా కర్మనిష్ఠులు దక్షిణాయనమునందే రాత్రి కాలముననే మరణింతురని కాని తలంచుట వీలు లేదు. ప్రారబ్ధముయొక్క అంతమున ఎవరి శరీరమైనను ఎప్పుడైన పడిపోవచ్చును. ప్రారబ్ధము శరీరమును ఇచ్చిన తరువాత దానిని అవలంబించి కొంద ఉపాసనలు, మఱికొందఱు యజ్ఞయాగాదులను గావించుచుందురు. ఉపాసనలు గా కర్మనిష్ఠలు గాని ప్రారబ్ధమును మార్పవు. అందువలన వీరిలో ఎవడు ఎప్పు మరణించినను ఉపాసకులు శుక్లమార్గమున బ్రహ్మలోకమునకు, కర్మనిష్ఠ కృష్ణమార్గమున ఇంద్రలోకాదులకు తప్పక చేరుదురు.

అట్లయినచో అంపశయ్యపై భీష్ముడు బాధను భరించుచు పెక్కుదినముల యణము కొఱకు ఏల ప్రతీక్షించుచుండెను ? ఆయన తండ్రి యొసంగిన స్వచ్ఛం ము అను వరమును ప్రకాశింపజేయుటకు, ద్రౌపదీ వస్త్రాపహరణమును చూచుచ ధనాదులను శిక్షింపకుండుట మొదలగు అకృత్యములవలన కలిగిన పాపమునక శ్చిత్తమును పొందుటకు, అంపశయ్యపై నుండి ఉత్తరాయణముయొక్క హ్యమును నిరూపించెను. అనగా సంకల్పపూర్వకముగా శరీరమున పదలంచువారు, మహాప్రస్థానము మొదలగువానిని ఉత్తరాయణమునంద పవలెనని ఆయన సూచించినాడు. ఆయన ఉత్తరాయణమునందు మరణించినన లోకమునకు పోలేదు. ఆయన తనకు పూర్వస్థానమైన వసుత్వమునే పొందెను చార్యుడు దక్షిణాయనమునందు మరణించినను బ్రహ్మలోకమునకే పోయినట్ల గారతమున చెప్పబడియున్నది. కావున మరణకాలమునకు ఈ మార్గములంద ంచి, ఉపాసనయొక్క, యజ్ఞయాగాదులయొక్క ఫలములను పొందుటకు ఎట్టి ధము లేదు.

స్వర్గాదిలోకములనుండియే కాక బ్రహ్మలోకమునుండి కూడ మరలివచ్చుట ంపవచ్చు ననుట మూడవ విషయము. "ఆ బ్రహ్మభువనాల్లోకాః పునరావర్తినో అని భగవానుడు చెప్పిన సందర్భము శ్రీశంకరులవారు, "ఆ బ్రహ్మభువనాత్" "బ్రహ్మలోకముతో కూడ" అని వ్యాఖ్యానించినారు.

"ఆబ్రహ్మభువనాత్ సహబ్రహ్మభువనేన లోకాః సర్వే పునరావర్తినః వర్తన స్వభావాః"

కాని ప్రణవమును బ్రహ్మమునుగా ఉపాసించి బ్రహ్మలోకమునకు రవాడు పరమగతిని అనగా మోక్షమును పొందుచున్నాడు (స యాతి పరమాం అని, శుక్లగతిచే బ్రహ్మలోకమునకు చేరినవాడు అనావృత్తిని పొందును (ఏకయా ;నావృత్తిమ్) అని భగవంతుడే చెప్పియున్నాడు. మఱి బ్రహ్మలోకము పునరావర్తి ఇది పూర్వాపర విరోధము కాదా!

ఈ విరోధమును పరిహరించుటకై కొందఱు ఇట్లందురు. ప్రళయమునందు దిలోకములతో పాటు బ్రహ్మలోకము కూడ నశించి మరల పబడుచుండును. కావున బ్రహ్మలోకము కూడ స్వర్గాదులవలె మరల తిరిగివచ్చు నము కలదే. కాని బ్రహ్మలోకమునకు చేరినవారు మాత్రము ఆలోకాధిపతితో ముక్తి పొందుదురు ; తిరిగిరారు.

కాని యిక్కడ భగవంతుడు ఉపాసకులైన యోగులను గూర్చి చెప్పుచున్నాడు కాని ులల పునరావర్తనమునుగూర్చి చెప్పుటలేదు. ప్రళయమునందు సకలలోకములు సృష్ట్యారంభమున మరల వచ్చు ననుట సుప్రసిద్ధము. ఆవిషయమున ఇక్కడ

సంశయము లేదు. బ్రహ్మలోకమునకు చేరినవా రందఱు అచ్చటనే ముక్తిని పొందుదురా? లేక వారిలో కొందరు తిరిగి వచ్చుట కూడ సంభవించునా అన్నదే ఇచ్చట సంశయము. బ్రహ్మలోకమునకు పోయినప్పటికిని కొందఱకు తిరిగి వచ్చుట తప్ప దని తన్ను పొందినవారికి మాత్రము పునర్జన్మ యుండ దని భగవంతుడు ఉద్ఘాటించుచున్నాడు.

ఈ సందర్భమున కృష్ణ శుక్ల మార్గములయొక్క విశేషములను గ్రహించుట ఆవశ్యకము. ఇష్టాపూర్తములను దానములను ఉపాసించువారు మరణించినప్పుడు ధూమము, రాత్రి, కృష్ణపక్షము, దక్షిణాయనము అనుదేవతలను చేరుదురు. వీరు సంవత్సరదేవతను చేరరు. దక్షిణాయనమాసదేవతనుండి వీరు పితృలోకమునకు అటనుండి ఆకాశమునకు అటనుండు చంద్రుని చేరుదురు. అచ్చట పుణ్యఫలమును అనుభవించి తిరిగి వత్తురు.

పంచాగ్నివిద్య నెఱింగిన గృహస్థులు, అరణ్యమునందుండి ఉపాసనలు గావించు వానప్రస్థులు, శ్రద్ధాళువులైన తాపసులు, పరివ్రాజకులు, నైష్ఠిక బ్రహ్మచారులు శరీరవియోగమును పొందినప్పుడు అర్చిస్సు, అహస్సు, శుక్లపక్షము, ఉత్తరాయణమాసములు, సంవత్సరము, ఆదిత్యుడు, చంద్రుడు, విద్యుత్తు అను దేవతలను చేరుదురు. అచ్చటికి బ్రహ్మలోకమునుండి వచ్చిన అమానవుడైన పురుషుడు, అనగా మనువు సృష్టిలోనివాడు కాదు, వారిని బ్రహ్మలోకమునకు చేర్చును.

విద్యుల్లోకమునకు చేరినవారి నందఱను ఈపురుషుడు బ్రహ్మలోకమునకు తీసికొనిపోడు. నామము మనస్సు, వాక్కు మొదలగు ప్రతీకలను అవలంబించి ఉపాసనలు గావించినవారు విద్యుల్లోకమునందే యుందురు. పంచాగ్ని విద్యోపాసకులను సగుణ బ్రహ్మోపాసకులను వానప్రస్థ పరివ్రాజక నైష్ఠిక బ్రహ్మచారులను ఆపురుషుడు బ్రహ్మలోకమునకు చేర్చును (బ్ర.సూ. 4-3-15).

బ్రహ్మలోకమునకు చేరినవా రందఱను అచ్చట తప్పక ముక్తి పొందుదు రని చెప్పుటకు వీలు లేదు. ఛాందోగ్యమున అక్షిపురుష విద్యయందు ఇట్లున్నది. "ఆ మానవుడైన పురుషుడు వీరిని బ్రహ్మమునకు చేర్చుచున్నాడు. ఇది దేవపథము బ్రహ్మపథము. దీనిచేత (బ్రహ్మమును) పొందుచున్నవారు ఈ మానవమైన యావర్తమును పొందరు పొందరు".

తత్పురుషో௨మానవః స ఏనాన్ బ్రహ్మ గమయ త్యేష దేవపథో బ్రహ్మపథః ఏతేన ప్రతిపద్యమానా ఇమం మానవ మావర్తం నావర్తన్తే నా వర్తన్తే ॥ (4 - 15 - 5)

ఇచ్చట ఆనందగిరి టీకయందు ఇట్లున్నది. "ఇమమ్" (ఈ మానవమైన యావర్తమును) అను విశేషమువలన ఈ కల్పమునందు అనావృత్తి, కల్పాంతరమునందు ఆవృత్తియు నుండు నని సూచింపబడుచున్నది".

ఇమ మితి విశేషాణాత్ అనావృత్తి రస్మిన్ కల్పే, కల్పాంతరే తు ఆవృత్తి రిః
హచ్యతే|

ఈ విషయమునే బ్రహ్మసూత్ర శంకరభాష్యవ్యాఖ్యానమునంద
ీగోవిందానన్దులవారు ఇట్లు ఉద్ఘాటించిరి. "ఇమమ్" (ఈ మానవమైన యావర్తమును
ను విశేషణమువలన ఈ కల్పమునందు బ్రహ్మలోకమునకు చేరిన వారిః
ల్పాంతరమునందు ఆవృత్తి కలుగు నని తోచుచున్నది. అయినప్పటిః
శ్వరోపాసనము లేకుండ పంచాగ్ని విద్య, అశ్వమేధము, దృఢబ్రహ్మచర్యమ
ుదలగు సాధనములచేత ఎవరు (బ్రహ్మలోకమును) చేరిరో వారికి, తత్త్వజ్ఞానమ
ండవలయు నను నియమము లేక పోవుటవలన, ఆవృత్తి కలుగును. ఎవర
హారాదికమైన యీశ్వరోపాసనచేత చేరిరో వారికి సగుణవిద్యాఫలము క్షయమ
ిందినప్పుడు కూడ నిరవగ్రహమైన యీశ్వరానుగ్రహముచేత లబ్ధమైన
త్మజ్ఞానమువలన ముక్తి తప్పక లభించును. "మఱి ఇచ్చట సూత్రకారునిచేః
గుణబ్రహ్మవేత్తలకే అనావృత్తి క్రమము చెప్పబడినది ; నిర్గుణ బ్రహ్మవేత్తలక
ప్పబడలేదు ; ఇందులకు హేతు వేమి" అని ఆశంకించి, వారినిగూర్చి ఆ శంకయే
కుండుటవలన, (సమ్యగ్దర్శనముచేత తమస్సు విధ్వస్తమైన వారిక
త్యసిద్ధనిర్వాణపరాయణులైన వారికి అనావృత్తి సిద్ధమే) సమ్యగిత్యాదిగా
ాష్యకారుడు చెప్పుచున్నాడు. సగుణబ్రహ్మవేత్తలకు ఆవృత్తి కలుగువలసియుండగా
మ్యగ్దర్శనమును ఆశ్రయించుటచేతనే అనావృత్తి సాధింపబడుచున్నది. కావున
్వయముగా సమ్యగ్దర్శనులైన వారికి ఆవృత్తినిగూర్చి శంకయే లే దని చెప్పవలసిన ద
ున్నది అని యర్థము".

"ఇమ మితి విశేషణాత్ అస్మిన్ కల్పే బ్రహ్మలోకం గతానాం కల్పాన్తరే ఆవృత్తిః
ంతి| తథాపి ఈశ్వరోపాస్తిం వినా పంచాగ్ని విద్యాశ్వమేధ బ్రహ్మచర్యాది సాధనైః
ే గతాః తేషాం తత్త్వజ్ఞాన నియమాభావాత్ ఆవృత్తిః స్యాత్| యే తు దహరాది
ఃశ్వరోపాస్త్యా గతాః తేషాం సగుణ విద్యాఫలక్షయేఽపి నిరవగ్రహ
ఃశ్వరానుగ్రహలబ్ధ ఆత్మజ్ఞానాత్ ముక్తినియమః ఇ త్యభిప్రే త్యాహ. అంతవత్త్వేఽపి
ఇతి| నన్వత్ర సూత్రకృతా సగుణ విదా మేవ అనావృత్తి క్రమః ఉక్తః న నిర్గుణవిదామ్
త్ర కో హేతు రిత్యాశంక్య, తేషా మావృత్తి శంకాభావా ది త్యాహ - సమ్య గితి
వాశ్రయణేన ఇతి సగుణవిదాం ఆవృత్తి ప్రాప్తౌ, సమ్యగ్దర్శనాశ్రయణేన ఏవ
నావృత్తిః సాధితా | అతః స్వతః సమ్యగ్దర్శినాం ఆవృత్తి శంకా నేతి కిము వాచ్య మిః
్యర్థః | (బ్ర. సూ. 4 - 4- 22)

సమ్యగ్దర్శనములేక, బ్రహ్మలోకమునుండి తిరిగివచ్చువారు, శుక్లమార్గముననే
ిరిగివత్తు రని గ్రహింపవలసియున్నది.

## (iii) భగవత్స్వరూప నిరూపణ చమనము

## గీత

శుక్లగతిని కృష్ణగతిని వివరించిన తరువాత భగవానుడు, ఆ గతులకు సంబంధ
లేకుండ ఇక్కడనే ఇప్పుడే ముక్తిని కలిగించునట్టి ఆత్మజ్ఞానమును ప్రశంసించుచు ఇ
చెప్పెను. "నీకు నాయందు అసూయకలుగుట లేదు. కావున నీకు రాజవి
రాజగుహ్యము పవిత్రము ఉత్తమమును అయిన జ్ఞానమును విజ్ఞానసహితము
బోధింతును వినుము. దీనిని తెలిసికొన్నచో నీవు సంసారమునుండి మోక్షము
పొందగలవు. దీనిని నీవు ప్రత్యక్షముగా తెలిసికొనగలవు. ఇది ధర్మమునకు దూర
కాదు. ఇది సుఖముగా సంపాదింపవీలయినది. అయినను సుఖసంపాద్యము
కర్మఫలములవలె ఈ జ్ఞానముయొక్క ఫలము ఎప్పటికిని క్షీణించునది కాదు".

శ్లో॥ ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే |
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసే ऽశుభాత్ ||

శ్లో॥ రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్ |
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్ ||

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 33

## విజయప్రభ

రాజవిద్య యనగా విద్యలలో రాజువంటిది. ఊర్ధ్వలోకమునకు రె
మార్గములు ఉపనిషత్తులలో చెప్పబడినవి. యజ్ఞయాగదానాదులు చేసినవారు ద
మార్గమున స్వర్గాదిలోకములకు పోవుదురు. పంచాగ్ని విద్యను, నగుణబ్రహ్మవిద్య
ఉపాసించినవారు ఉత్తరమార్గమున బ్రహ్మలోకమునకు పోవుదురు. ఈ మార్గ
బ్రహ్మలోకమునకు పైన ఏలోకములు చెప్పబడ లేదు. కావున ఉత్తమలోకము
పురాణములలో ప్రశంసింపబడిన వైకుంఠము, కైలాసము, సత్యలోకము, దేవీలోక
గోలోకము మొదలగునవి యన్నియు బ్రహ్మలోకములోనే కొన్ని ప్రత్యేక నివేశన
లని (colonies) గ్రహింపవలసియున్నది. అంతే కాని అవి బ్రహ్మలోకము కంటె భిన్న
లైనవి కావు ; ఉన్నత మైనవి కావు.

గుహ్య మనగా రహస్యముగా నుంచవలసినది. మంత్రోపాసనము మొదలై
గుహ్యములు. అట్టివానిలో రాజువంటిది రాజగుహ్యము. అనుభవముతో కూడి
(coupled with practical experience) విజ్ఞానము.

వైకుంఠప్రాప్తి, కైలాసగమనము మొదలగునవి ప్రత్యక్షావగమములు కాదు. గమము అనగా తెలియుట. ఇతరులవలన వినుట శాస్త్రప్రమాణము చేత గ్రహించుట, ాంచుట మొదలుగా తెలియుట అనేక విధములుగా నున్నది. ఆత్మజ్ఞానము అట్టిది ). సుఖము దుఃఖము మొదలగునవి ఎట్లు ప్రత్యక్షముగా తెలియుచున్నవో అట్లే ్మజ్ఞానము కూడ సాక్షాత్తుగా తెలియును. "నేను సుఖపడుచున్నాను", "నేను దుః ఖచున్నాను" అను విషయములలో ఎట్లు సందేహము కలుగుట లేదో, అట్లే ్మజ్ఞానము కలిగినప్పుడు దానియందు సందేహమునకు అవకాశము ఉండదు.

తన్ను గూర్చి తాను తెలిసికొనుటయే కాబట్టి ఇందు కష్టపడవలసినది ఏదియు ). దీనిని మిగుల సుఖముగా పొందవచ్చును. అల్పశ్రమతో ్కార్యమునో యజ్ఞమునో చేసిన వానికి కొద్దిఫలము, పెద్దశ్రమతో పెద్ద పారమునో యజ్ఞమునో చేసినవానికి గొప్పఫలము లభించుట ప్రసిద్ధముగా నున్నది. శమకు తగిన ఫలము లబింపవలె ననుట యుక్తమే. కాని ఇది ఆసూత్రమునకు వాదము. ఇది ఎంత సులభముగా లభించినప్పటికీ దీనివలన కలుగుఫలము యము నొందదు ; అనగా క్షీణింపదు. కావున ఇది అవ్యయము.

## గీత

తాను ప్రశంసించిన శ్రేష్ఠమైన జ్ఞానమును భగవంతుడు ఇట్లు బోధించెను. ్యక్తమైన రూపముతో నాచేత ఈ జగత్తు అంతయు వ్యాప్తమై యున్నది. భూతములు నాయందున్నవి. కాని నేను వానియందు లేను. భూతములు నాయందు ి లేవు. నాయీశ్వరశక్తియొక్క యోగమును చూడుము. భూతభావనమైన నాయాత్మ ్ములను భరించుచుండియు భూతములయందు లేదు. అంతటను వ్యాపించి దిగా ఉన్న వాయువు ఎల్లప్పుడు ఆకాశమునందు ఎట్లు ఉన్నదో అట్లే భూతములు నాయందు ఉన్నవని ఎఱుంగుము".

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా |
మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః || 4

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్ |
భూతభృత్ న చ భూతస్థో మమాత్మా భూతభావనః || 5

య థాకాశస్థితో వాయుః సర్వత్రగో మహాన్ |
తథా సర్వాణి భూతాని మత్స్థా నీ త్యుపధారయ || 6

"నా యాత్మ భూతభావన" మనగా అది భూతములను పుట్టించునది లేక వర్ధి జేయునది అని యర్థము. అట్లయినచో ఆత్మకు కర్తృత్వమున్నదా ? లేదు. దేనియం భూతములు పుట్టినట్లుగా వర్తిల్లుచున్నట్లుగా గోచరించుచున్నవో అది యాత్మ అట్లయినచో "నా ఆత్మ" అని భగవాను డన్నప్పుడు, "మా యిల్లు" అన్నప్పుడు ఇ మనకంటె భిన్నముగా ఎట్లున్నదో అట్లే, యీ యాత్మ ఆయనకంటె అన్యము నున్నదా ? లేదు. "నా యాత్మ" అనగా "నాస్వరూపము లేక నేను" అనియే యర్థము. ఇ భూతములను భరించుచున్నది (భూతభృత్) లేక ధరించుచున్నది. కా ఆభూతములయందు ఇది లేదు (న చ భూతస్థః) మంటపమును భరించుచున్న స్తంభము మంటపమునందు ఉండవు. మంటపమునందు కలుగుమార్పు లేవియ స్తంభములయందు సంభవింప నక్కఱ లేదు. పాలను ధరించుచున్న గిన్నె పాలయం లేదు. ఆపాలయందు ఎట్టిమార్పులు సంభవించినను అవి ఆపాలను ధరించుచున్న గిన్నె యందు సంభవింపవు. అట్లే భూతములయందు సంభవించునట్టి సృష్టిస్థితిలయా విశేషములు ఏవియు, వానిని భరించుచున్న లేక ధరించుచున్న యాత్మయం సంభవింపవు.

"సర్వభూతములు నాయం దున్నవి ; నేను వానియందు లేను" అని భగవాను చెప్పిన విషయమును పైదృష్టాంతముల చేత గ్రహింపవచ్చును. కాని, "భూతములు న యందు లేవు" అని భగవానుడు చెప్పుట (మత్స్థాని సర్వభూతాని..... న చ మత్స్థా భూతాని) ఎట్లు కుదురును ? ఈ వాక్యములు పరస్పర విరుద్ధములు కావా ? కావు ఎందువలన ? వెండి చెంబు, వెండి కంచము, వెండి గిన్నె మొదలగునవి వెండియం ఉండును. కాని వెండి, కంచముయొక్క ఆకృతి యందు ఉండదు. చెంబు మొదలగున పుట్టుటకు పూర్వము, ఆరూపములు పోయిన పిమ్మట వెండి, ముద్దయే యుండును ఆరూపములలో వెండి యున్నచో ఆరూపములు నశించునప్పుడు వెండి కూ నశింపవలె. కాని అది అట్లు నశించుట లేదు. కావున ఆరూపములలో వెండి లేదు. అ ఆత్మయందు సకలభూతములు సృష్టిస్థితిలయములను పొందుచున్నట్లు గోచరించుచ ఉన్నను, వానియందు ఆత్మ ఉండదు. అవి గోచరించుటకు పూర్వము, అవి నశించి తరువాత, అది నిర్వికారముగా నిత్యముగా ఉన్నది. అనగా దానియందు భూతముల గోచరించుచు ఉన్నను, ఆ భూతముల ఆకృతులయందు ఆత్మ లేదు. ఆకాశమునంద అంతటను వ్యాపించుచు వాయువు ఎట్లున్నదో, అట్లే భూతము లన్నియు ఆత్మయందు ఉన్నవి. వాయువునందలి వికారములు ఏవియు ఆకాశమునకు ఎట్లు సంబంధించు లేదో అట్లే భూతములయందు కలుగు వికారములు ఏవియు ఆత్మకు సంబంధింపవు అది ఎల్లప్పుడు నిర్వికారముగానే యుండును.

## గీత

భూతములజగత్తునకు తనకు గల సంబంధమునుగూర్చి భగవంతు డి
మన్నాడు. "నేను నా ప్రకృతిని వశపఱచుకొని, ప్రకృతికి వశమైయున్న యీ సమ
సముదాయమును మరల మరల సృష్టించుచున్నాను. కాని ఆభూతముల
ధించినకర్మలు, ఆకర్మలయందు సక్తుడను గాక ఉదాసీనుడనై యున్న నన
పవు. నేను అధ్యక్షుడనుగా ప్రకృతి చరాచరమైన జగత్తును సృష్టించుచున్న
ణముచేతనే జగత్తు అనేకవిధముల పరివర్తనము నొందుచున్నది".

ప్రకృతిం స్వా మవష్టభ్య విసృజామి పునః పునః |
భూతగ్రామ మిమం కృత్స్న మవశం ప్రకృతే ర్వశాత్ ||

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనంజయ |
ఉదాసీనవ దాసీన మసక్తం తేమ కర్మసు ||

మ యాధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్ |
హేతు నానేన కౌంతేయ జగ ద్విపరివర్తతే ||

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 33

## విజయప్రభ

భగవంతునకు ప్రకృతి లోబడియుండును. ఆయనయొక్క సంకల్పమ
రించి ఆ ప్రకృతి, తనకు లోబడియుండి అస్వతంత్రములైన, ప్రకృ
ములకు లోబడియున్న భూతములను మరల మరల సృష్టించుచుండును. అనగా
లయములు ఒకదాని వెంటనొకటిగా నిరంతరము జరుగుచుండు నన్నమాట
వైషమ్యములతో జగత్తును సృష్టించుచు, ఆవైషమ్యముల ననుసరించి వెక్కు
ములతో దానికి స్థితిని తుదకు లయమును ఈశ్వరుడు చేయుచున్నప్పుడు ఆ
ర్యములయొక్క ఫలములు ఆయనను బంధింపవా ? బంధింపవు. ఎందువలన
బు ప్రకృతివలన జరుగుచున్నప్పుడు, వానియందు తాను ఆసక్తి నొందక
నుడై యుండుటవలన తన్ను ఆకర్మలు బంధించుట లేదని భగవానుడు
నము చెప్పుచున్నాడు. పోటీలతో క్రీడలు జరుగుచున్నప్పుడు ఏ పక్షమునకు
ంపక ఊరక చూచుచున్నవానికి ఏ పక్షము గెలిచినను ఓడినను సుఖము దుః
బుగవు ; ఆ క్రీడ యంతము వినోదమాత్రముగానే యుండును. అట్లే ప్రకృతి
చున్న జగత్క్రీడను ఉదాసీనముగా చూచుచున్న యీశ్వరునకు ఆ క్రీడలోని
యొక్క ఫలములయందు ఆసక్తి "నేను చేయుచున్నాను" అను నభిమానము
టవలన, ఆకర్మలు ఆయనను బంధించుట లేదు. ఇది ఆయనవిషయము

మాత్రమే కాదు. లోకములో ఎవ డైనను తనవలన ఏ కర్మలు జరుగుచున్న వానిఫలములయందు ఆసక్తి నొందక, "మనస్సు, ఇంద్రియములు శరీరము పను చేయుచున్నవి; నేనేమియు చేయుట లేదు" అని కర్తృత్వాభిమానమును వీడియుండు అట్టివానిని కూడ ఆకర్మలు బంధింపవు.

"నేను సృష్టించుచున్నాను" (విసృజామి) అని చెప్పి వెంటనే, "నే ఉదాసీనునివలె ఉన్నాను" అని భగవానుడు చెప్పుట పరస్పర విరుద్ధము కదా! విరోధమును పరిహరించుటకే, ప్రకృతి కావించుచున్న సృష్టియందు తాను అధ్యక్షతచే నిమిత్తమాత్రుడే కాని కర్త కా దని భగవంతుడు చెప్పుచున్నాడు. సూర్యుడు ఉదయించినంతనే ఆయన సన్నిధియందు లోకమున ఎన్నో కార్యములు జరుగుచున్న ఆయనయొక్క అధ్యక్షత, లేక కాంతిప్రసారము, లేకున్నచో ఎన్నో కార్యము జరుగవనుట సుప్రసిద్ధము. అంతమాత్రముచేత ఆయన ఆకార్యములకు కర్త యని గా ప్రేరకు డని గాని చెప్పుటకు వీలు లేదు. ఉదయించుట ప్రకాశించుట ఆయనకి స్వభావము. ఆప్రకాశమువలన లోకములో జరుగుకార్యములు ఆయనకి సంబంధింపవు. అట్లే చైతన్యముతో ప్రకాశించుచుండుట పరమాత్మకు స్వభావము ఆప్రకాశమువలన ప్రకృతియందు జరుగుకార్యములు ఆయనకు సంబంధింపవు.

"ఈ కారణముచేతనే జగత్తు అనేకవిధముల పరివర్తనము నొందుచున్నది" అ భగవంతుడు చెప్పుచున్నాడు. ఈమాటనుబట్టి ప్రతివ్యక్తి యొక్క ప్రవృత్తి అంతయ ఇట్టిదే అని గ్రహింపవలసి యున్నది. ప్రతివ్యక్తికి వానిజగత్తు, వ్యవహారము సర్వమ వాని జ్ఞానముపైననే ఆధారపడియున్నది. "నేను గ్రహించుచున్నాను" అన్న జ్ఞానముయొక్క వెలుగును పొందిన మనస్సు ఏ యే పదార్థములను వ్యక్తులన సంఘటనములను గ్రహించుచున్నదో అవియే ఒక్కొక్కనికి ఒక్కొక్క జగత్తుగ అగుచున్నది. ఎవని మనస్సు దేనిని గ్రహింపదో అది వాని జగత్తులో ఉండదు. మ వ్యక్తికి వెలుపల వస్తురూపమైన జగత్తు (objective world) ఉన్నది కదా ! ఉన్నది. దనుట లేదు. అది మనకు సత్యము కాదు ; యథార్థము కాదు ; మనవ్యవహారమునక ఆధారము కాదు. మన మనస్సుచే దేనిని ఎప్పుడు సత్యముగా యథార్థముగ గ్రహించుచున్నామో అదియే మనకు సత్యము యథార్థమును అయిన జగత్తు అయి మ సుఖదుఃఖములకు ఆధారమగుచున్నది. సూర్యుడు చెప్పువఱకు కర్ణునకు తాన కుంతీపుత్రు డను విషయము తెలియదు. తెలిసినప్పటి నుండి కర్ణుని జగత్తులో తాన కుంతీపుత్రుడు, పాండవులు తనకు సోదరులు అయినారు. అంతకు పూర్వము అత జగత్తులో వారు సోదరులు కారు, శత్రువులు. అట్లే కుంతీదేవి చెప్పువఱక పాండవులప్రపంచములో కర్ణుడు కేవలము కన్యాపుత్త్రుడు ; ఎవరో దిక్కుమాలికకన్య కని పాఱవైచినవాడు, సూతునిచే పెంచబడిన వాడు ; దుర్గార్గుడు వధ్యుడు. అవె కర్ణునిగూర్చి అతడు తనపుత్త్రు డని చెప్పినంతనే పాండవుల ప్రపంచములో ఆ కర్ణు

అట్లే ఒథెల్లో కథలో వానిభార్య డెస్డిమోనా మొదటి నుండి తుదివఱకు
వ్రతయే ; కాని అతనికి అయాగో అనువానివలన ఆమె జారిణి అను అనుమానవ
గెను. దానితో అతడు ఆమెను గొంతు నులిమి చంపెను. వెంట
యాగో భార్యవలన డెస్డిమోనా జారిణి కాదని ఒథెల్లోకు తెలిసెను. అతడ
శ్చాత్తాపముతో ఆత్మహత్యకు పాల్పడెను. ఈ సందర్భమున అతడు ఆమెన
మించుచున్నప్పుడు, జారిణినిగా తలంచి హత్యచేసినప్పుడు, తరువా
షరహితురాలినిగా గ్రహించినప్పుడు, మూడు కాలములయందును ఆమె
వ్రతగానే యుండెను. కాని అతడు ఆమెనుగూర్చి ఎప్పుడు ఏవిధముగ
గాంచుచున్నాడో ఆజ్ఞానమే వానికి యథార్థమై (Reality) వాని వ్యవహారమునక
ణమైనది. అంతేకాని ఆమె మూడు కాలములందును పతివ్రతగానే యుండు
న్నవాస్తవము అతనికి యథార్థము కాలేదు. కావున ప్రతివ్యక్తికి అతడ
గాంచుచున్న జగత్తే వానికి యథార్థము. ఈ జగత్తు యొక్క ఉనికి మనస్సుపైన
ారపడియున్నది. "నేను" అను చైతన్యముతో మనస్సు మేల్కొనినంతనే యీ జగత్తు
ప్టచున్నది ; ఇంద్రియములు సాధనములుగా మనస్సు పనిచేయుచున్నప్పుడు ఈ
త్తుయొక్క వ్యవహారము జరుగుచున్నది. గాఢనిద్రలో గాని, గాఢసమాధిలో గాని
స్సు లీనమైనప్పుడు ఇది కూడ లయము నొందుచున్నది. అనగా తనజగత్తుయొక్క
ష్టిస్థితిలయములకు ప్రతివ్యక్తి తానే కారకుడైన యీశ్వరు డగుచున్నా డన్నమాట
మువలన, తన మనస్సునందే సృష్టిస్థితిలయములను పొందుచున్న జగత్తును
వ్యమాత్రుడైన తనయందే, దృశ్యపరంపరామాత్రముగా ఎవడు చూచుచున్నాడో
, నాటకమునందలి మనోహరదృశ్యములతోపాటు భయంకరదృశ్యములను కూడ
త్మకముగనే గ్రహించి ఆనందించు ప్రేక్షకుని వలె, నిరంతరము ఆనందమునే
దుచుండును.

## గీత

ఈస్థితిని పొందగోరువారు తన్ను ఎట్లు ఆరాధింతురో చెప్పుచు భగవానుడు
నుని కూడ ఆ పదతినే అవలంబింపు మని బోధించుచున్నాడు. "మహాత్ములు
నియమాదులతో దృఢవ్రతులై మనస్సును నాయందే నిలిపి భక్తితో నాకు
స్కరించుచు నన్ను, కీర్తించుచు, ధ్యానించుచు నిరంతరము ఉపాసించుచుందురు.
రఱు జ్ఞానయజ్ఞముచేత ఏకత్వముతో నన్ను పూజించుచు ఉపాసించుచున్నారు.
కొందఱు పృథక్త్వముతో బహువిధములుగా విశ్వతోముఖునిగా నన్ను
సించుచున్నారు".

సతతం కీర్తయంతో మాం యతంత శ్చ దృఢవ్రతాః |
నమస్యంత శ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే || 14

శ్లో॥ జ్ఞానయజ్ఞేన చా ప్యన్యే యజంతో మా ముపాసతే।
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతో ముఖమ్ ॥ 1

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 33

# విజయప్రభ

ఇందు మూడు విధములైన యుపాసనలు చెప్పబడినవి. కొందఱు భగవంతు యొక్క రూపమును ఎదుటగాని మనస్సులో గాని కల్పించుకొని దృఢసంకల్పముః యమనియమాదుల నవలంబించి నమస్కరించుచు, అనగా పూజించుచు ఆయనయొః యవతార చరిత్రములను భావించుచు పఠించుచు గానము చేయుచుందురు. కొంద ఇంద్రుడు ఆదిత్యుడు మొదలగు భేదములతో ఆ భగవంతుడే ఉన్నాడు అనుతలంపుః ఇంద్రుడే సర్వేశ్వరు డని, ఆదిత్యుడే పరమేశ్వరు డని, ఎవరియభిరుచిని బట్టి వా ఒక్కొక్క దేవతామూర్తిని భగవంతునిగా ఉపాసించుచున్నారు. మఱికొందఱు దేవతామూర్తులను పూజించుటను మాని సర్వాంతర్యామియు అద్వితీయముః పరబ్రహ్మమునే భగవంతునిగా భావించుచుండుటయే జ్ఞానయజ్ఞము ఉపాసించుచుందురు.

ఇంద్రాదిత్యాది దేవతలను, స్వర్గము ఆరోగ్యము మొదలగు ఫలములను గ ఉపాసించువారు కూడ భగవంతుని ఉపాసించినవారే అగుదురా ? మంత్రుల సేనాపతులను సేవించినచో మహారాజును సేవించినట్లు అగునా ? మంత్రుల సేనాపతులను సేవించువారికి వారియందు మంత్రులు సేనాపతులు అను భావన యుండును గాని మహారాజు అను భావన ఉండదు. ఇంద్రాదిత్యాది దేవతల పూజించువారు అట్లు కాక భగవంతుడే ఇంద్రుని రూపముతో ఆదిత్యునిరూపము ఉన్నా డను భావముతో ఉపాసింతురు. "మాతృదేవో భవ ! పితృదేవో భవ" ఆ వేదముయొక్క అనుశాసనమునకు కూడ తల్లిరూపమున తండ్రిరూపమున భగవంతు ఉన్నాడు అను నిశ్చయముతో వారిని సేవించుచు భగవంతునే సేవించుచున్నట్లు భావింపవలయు ననియే తాత్పర్యము. సకలపదార్థములలో సర్వాంతర్యామి భగవంతుడే వ్యాపించి యుండుటవలన, అన్ని రూపములు నామములు ఆయ అగుటవలన ఆయన విశ్వతోముఖుడు. కావున భగవంతుడు సర్వాంతర్యామి అ భావనతో భగవద్రూపమునుగా స్వీకరించి ఇష్టదేవతారూపముగా ఎవ ఆరాధించినను అది భగవదారాధనమే యగును.

ఈ యుపాసనాభేదములవలన ఫలములయందు కలుగు భేదములను క గ్రహింపవలసియున్నది. ఇంద్రాదిత్యాదిదేవతలను భగవద్రూపులనుగా ఉపాసించ ఫలములను కోరుచున్నచో అట్టివారు స్వర్గాదిలోకములకు పోయి ఆపుణ్యఫలమ

పభవించి తరిగివచ్చుచు పోవుచు అనేక జన్మలను పొందుచుందురు. ఫలమును కో
ా్కామముగా భగవంతుని సేవించుచు నుండువారు చిత్తశుద్ధిని పొందు
్యానయోగమునకు జ్ఞానోపదేశమునకు అర్హులగుదురు. భగవంతుని అద్వితీ
బ్రహ్మమునుగా భావించుచు ఉపాసించువారు జ్ఞాననిష్ఠులై ముక్తు లగుదురు.

## గీత

జగద్వ్యవహారమును పూర్తిగా వర్జించి జగత్తు నందు అంతర్యామిగా ను
వంతునే తప్ప అన్యమును గ్రహింపకుండ ఉపాసించుచుండు వారికి, ఈ లోకము
ంగక్షేమములు ఎట్లు జరుగును ? తల్లిదండ్రులను ఆశ్రయించియున్న పిల్ల
ంగక్షేమములను తల్లిదండ్రులు చూతురు. బిడ్డలను ఆశ్రయించుకొనియున
దండ్రుల యోగక్షేమములను బిడ్డలు చూతురు. సంపన్నులనో దేవతలన
ంచువారి యోగక్షేమములను ఆసంపన్నులో ఆయాదేవతలో చూతురు. ఇ
శ్రయముల నన్నింటిని వదలి భగవంతునే భజించువారి యోగక్షేమములను ఎవ
తురు. "ఇతరులను ఎవ్వరిని ఆశ్రయింపక నాయందే మనస్సును ఉంచి నిత్యము నన్నే
ించుచు ఎవరు ఉపాసించుచున్నారో వారియోగక్షేమములను నేన
'ంచుచున్నాను" అను భగవంతుడు ఉద్ఘాటించుచున్నాడు.

అనన్యా శ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే |
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ‖ 22

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - భగవద్గీతాయామ్ - అధ్యా. 9

## విజయప్రభ

భగవంతుని యీవాక్యమునందు నమ్మకము కుదురుట సులభము కాదు.
మైన నమ్మక మున్నచో భగవంతుని రక్షణము సంభవించుట నిశ్చితమే.
మతీర్థస్వామియొక్క శిష్యులు కొందఱు, "మనప్రయత్నముల నన్నింటిని వదలి
ా నీవే దిక్కు" అని యూరకున్నచో ఆదేవుడే వచ్చి మన యాకలిదప్పులను
ా" అని ప్రశ్నించిరి. "మనకు అంతటి దృఢవిశ్వాస మున్నచో భగవంతుడు కూడ
నుందు శ్రద్ధ కలిగియే యుండును" అని ఆయన దృఢముగా చెప్పి మీకు
యమును నిరూపింతు ననెను. అట్లయినచో వెంటనే నిరూపింపు డని వారు
నను ప్రార్థించిరి. ఆయన ఇట్లనెను. "అట్లే నిరూపింతును. మనము రేపు యాత్రకు
ందేరుదము ; మీ రందఱు భగవంతుడు గావించిన వాగ్దానమును దృఢముగా
చున్నారు గదా !" వారందఱు, "ఔను ! మేము దృఢముగా నమ్ముచున్నాము"
ఆయన, "అట్లయినచో ఇంక మనకు డబ్బుతో పని యే మున్నది. అన్నింటికిని ఆ

భగవంతుడే యున్నాడు ; కాబట్టి మీరెవ్వరును డబ్బు తీసుకొని రావద్దు" అని చెప్పె అట్లే అని అంగీకరించి వారి మఱునాడు ఆయన చెప్పిన సమయమునకు బయలుదేర కొంతదూరము పోయిన తరువాత త్రోవలో నున్న నదికి వరదలు వచ్చిన వని రైలు పోక తప్ప దని తెలిసినది. అందువలన వారు గత్యంతరము లేక భార పంతం భగవంతునిపై వైచి టిక్కెట్లు లేకుండనే రైలులో ఎక్కిరి. రైలు ఆనదిపై పోవుచుండ రామతీర్థస్వామి శిష్యుల సంచులను జేబులను పరీక్షించెను. వారిలో కొంద రహస్యముగా కొంత డబ్బును దాచి తెచ్చికొనియుండిరి. దానినంతయు ఆయ ప్రోవుచేసి చేతిరుమాలులో కట్టి "భగవంతుని శరణుపొందినవారికి డబ్బుతో నేమి పని అని నదిలో "కృష్ణార్పణ" మని విసరివైచెను. ఇంతలో టిక్కెట్ కలెక్టరు వచ్చి వీరి దగ్గ టిక్కెట్లు లే వని తెలిసికొని మర్యాదగా ప్రక్క స్టేషనులో దిగిపొం డని చెప్పెను. అ వీరు ప్రక్క స్టేషనులో దిగిరి. అప్పటికి మధ్యాహ్నకాల మయ్యెను. అందఱు ఆకలి అలమటించుచుండిరి. "మనయాకలి దప్పికలను భగవంతుడే కదా తీర్పవలె. కాబ ఆయననే భజింతము" అని రామతీర్థుడు స్టేషను యొక్క ఆవరణములోనే ఒక చెట్టు క్రిం వారినందఱను కూర్చుండు డని సంకీర్తనమును ఆరంభించెను. ఓపిక ఉన్నను లేకున్న వారు కూడ భజన చేయుచుండిరి.

కొంతసేపైన తరువాత ఒకడు పెద్దగంపలో ఆహారపదార్థముల పానీయములను గైకొని వడివడిగా అచ్చటికి వచ్చెను. రామతీర్థుడు "ఎవరయ్యా! నీ ; ఎందులకు ఇక్కడికి వచ్చితివి?" అని అతని నడిగెను. అతడు వినయముతో ఆయన నమస్కరించి, "మా శ్రేష్ఠిగారు తీర్థయాత్ర చేయుచు ఇక్కడికి వచ్చినారు. ఇచ్చ దేవాలయమున స్వామికి అర్చన చేయించి వెలుపలి మండపమున స్వామి ధ్యానించుచు విశ్రమించినారు. ఆధ్యానమునందు స్వామి వారికి గోచరిం "రైల్వేస్టేషనులో నాభక్తులు భజన చేయుచున్నారు ; నీవు వెంటనే వారి ఆహారపానీయములు సమకూర్పు" మని ఆదేశించెను, వెంటనే వారు లేచి తావ వచ్చుటకు ఆలస్య మగునేమో అని ఈ పదార్థములను ఇచ్చి ముందుగా నన తటిమినట్లుగా పంపిరి, నేను వారి భృత్యుడను ; భగవంతుడు చెప్పినభక్తులు మీరే య అనుకొనుచున్నాను ; దయచేసి మీరు వీనిని స్వీకరింపుడు ; మా యజమాని కూ పరువెత్తినట్లుగా వచ్చుచున్నాడు ; ఇంక మీరు వీనిని ఉపయోగింపుడు" అ బ్రతిమిలాడ జొచ్చెను. ఆయజమాని కూడ వచ్చి వారిని అట్లే ప్రార్థించెను. అప్పు వారు తృప్తిగా భుజించి, ఆ శ్రేష్ఠియొక్క సాహాయ్యమున స్వగ్రామమునకు క్షేమముగ చేరిరి. కావున మనకు భగవంతునియందు దృఢవిశ్వాస మున్నచ మనయోగక్షేమములను ఆయన ఎప్పుడును విస్మరింప డనుట స్పష్టము.

మఱియును ఇతరదేవతలను ఆరాధించుటకంటె సర్వేశ్వరుని ఆరాధించు
ో సులభము. ఇంద్రాదిత్యాదిదేవతలను ఆరాధించునప్పుడు ఆయాదేవతల
కరములైన సమయములలో పదార్థములతో నియమములతో ఎం
పడవలసియుండును. ఫలాపేక్ష లేకుండ భగవంతుని ఆరాధించునప్పు
పూర్వకముగా మనము ఒక్కపండు నిచ్చినను, అదియు లేకున్నచో పుష్పమున
సీదళమువంటి పత్త్రమునో, జలమునో శుచిగా ఇచ్చినచో ఆయన స్వీకరించు
న సులభమైన మఱియొక ఉపాసనావిధానమును కూడ నిర్దేశించుచున్నాడు. దీ
పూజావిధానమే లేదు. "నీవు ఏ పనిని చేయుచున్నను, దేనిని తినుచున్నను, దేని
మము చేయుచున్నను, దేనిని దానము చేయుచున్నను, ఏదేని తపస్సు చేయుచున్న
ని అన్నింటిని నాకు అర్పింపుము. నీవు కావించుచున్న కర్మలు శుభము లైన
భములే అయినను ఫలరూపములైన యాకర్మయొక్క బంధములనుండి నీ
క్తుడవు కాగలవు. సర్వకర్మ ఫలార్పణ రూపమైన యీ సన్న్యాసయోగము
దినవాడు విముక్తుడై నన్ను పొందగలడు".

పత్త్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి |
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః || 2

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్ |
యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్ || 2

శుభాశుభఫలైరేవం మోక్ష్యసే కర్మబంధనైః |
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి || 2

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యా. 33

ఆయన ఈ యుపదేశమునే భంగ్యంతరమున ఇట్లు చెప్పుచున్నాడు. "నాయం
స్సు కలవాడవు, నా భక్తుడవు, నన్ను గూర్చి యజ్ఞములు చేయువాడవు అగుమ
నమస్కరింపుము. ఈవిధముగా చిత్తసమాధానము నొంది నన్నే పరమగతిని
సి నన్ను చేరగలవు".

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు |
మా మే వైష్యసి యుక్త్వై... వ మాత్మానం మత్పరాయణః || 3

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యాయః - 33

ఈయభిప్రాయమునే భగవానుడు, "సర్వధర్మములను పరిత్యజించి నన ఒక్కనినే శరణము పొందుము" అని తుది మాటనుగా చెప్పి యుపదేశము ముగించినాడు. కావున ఇది ఈయుపదేశమున కంతకును సారాంశ మనుట స్పష్టము

ఈ సందర్భముననే ఆయన ఒక హెచ్చరికను చేయుచున్నాడు. "అనిత్యః అసుఖము అయినలోకమును దీనిని పొంది నన్ను భజింపుము" (అనిత్య మసుఖం లో మిమం ప్రాప్య భజస్వ మామ్ 33 - 33) ఇట్లనుట వలన ఈలోకము అశాశ్వత మ సుఖరహిత మని, ఇందులకు విరుద్ధముగా తనస్వరూపము శాశ్వతమైన దని సుఖాత్మ మని, కావున తన్ను పొందు మని ఆయన స్పష్ట మొనర్చుచున్నాడు. ప్రతివ్యక్తి తా సుఖముగా శాశ్వతముగా నుండవలె నని అభిలషించుచున్నాడు. ఇక్కడ లభించుచు దానికంటె అధికమైన సుఖము చిరకాలము లభించు నని తోచినంతనే, వేదముల విశ్వసించువాడు, యజ్ఞాదులను చేసి స్వర్గాదిలోకములకు పోవలయు నని, ఈశరీరము వదలుకొనుటకు సైతము సిద్ధపడుచున్నాడు. కావున ఎవ డైనను భగవంతు భజింపవలయు నన్నచో ఈలోకము, ఈ మనుష్యశరీరము చాల క్షణిక మని, ఇక్క అప్పుడప్పుడు లభించు సుఖములకంటె, పిడుగులవలె పై బడు దుఃఖములే అధిక మ భగవంతుని స్వరూపము శాశ్వతమైన దని, స్వర్గాదులయందు లభించు సుఖముకం చాల అధిక మని అపరిమిత మని ముందుగా నమ్మవలసియున్నది. ఆ నమ్మకః లేకున్నచో భగవంతుని ఆశ్రయించుట కుదురదు. సకలభోగసంపన్నమై మహాభవనము లబించు నని రూఢిగా తెలిసికొన్నచో ఎవ్వ డైనను చిన్నయింటి సులభముగా వదలుకొని ఆభవనమునకు చేరుటకు కష్టపడి యైనను ప్రయత్నించుః ఈలోకమునందలి యైశ్వర్యసంపదలను తృణప్రాయముగా తలంచుచు ఎట్టిపరిస్థితియ దైనను భగవంతునే భజించుచుండిన త్యాగరాజు, రామదాసు, తుకారము, తులసీదాః కబీరు మొదలగు మహాభక్తుల దృష్టాంతములవలన ఈలోకము అశాశ్వత మ సుఖరహిత మని భగవంతుని స్వరూపము శాశ్వతము సుఖాత్మకము అని గ్రహింపవ

## (iv) విశ్వరూప దర్శనము

## గీత

ఆట పాటలయందు ఆసక్తుడై యున్న విద్యార్థికి, విద్యావిజ్ఞానములవలన పె యుద్యోగము కీర్తి సంపద మహాభోగములు లభించు నని దృఢముగా తోచిననే తః వాడు ఆటపాటలను వదలి విద్యాసముపార్జనకై పూనుకొనడు. అట్లే భగవంతు స్వరూపము అమృతానందమే అను విశ్వాసము రూఢముగా ఏర్పడిననే తప్ప ఆయన భజించుట కుదరదు. అందువలన భగవానుడు, "నేను సర్వజగత్తునకు ప్రభవస్థానమ నా వలననే సర్వము ప్రవర్తించుచున్నది అని తెలిసికొని పండితులు అట్టిభావనతో నన భజించుచున్నారు. అట్లు ప్రీతిపూర్వకముగా సతతము నన్ను భజించువార

ఁబుద్ధియోగము నొసంగుచున్నాను ; దానితో వారు నన్ను చేరుచున్నారు," అని చె
ప్పనునీయందు భగవంతుని స్వరూపమును తెలిసికోవలయు నను కుతూహలము
గించెను. అప్పుడు అర్జునుడు, "ఋషులు దేవర్షియైన నారదుడు. అసితుడైన దేవలు
వ్యాసుడు నిన్ను పరబ్రహ్మమునుగా చెప్పుచున్నారు. అది సత్యమే అ
ంచుచున్నాను, నీ ప్రభావమును దానవులు దేవతలు గ్రహింపలేకున్నారు. నీస్వరూ
మో నీకే తెలియును. ఏ మాహాత్మ్యవిశేషములచేత ఈలోకముల
వ్యాపించియున్నావో, ఏ యే భావములయందు నిన్ను చింతించుచు నే
సికొనగలనో ఆ విభూతి విశేషములను నీ యైశ్వర్య యోగమును విపులము
ప్పుము" అని యడిగెను.

అర్జునుని కుతూహలమును గమనించి భగవానుడు ఆ యా జాతులలో
ములలో అగ్రగణ్యములై ప్రధానములై విశేషములను, "ఆదిత్యులలో నేను విష్ణువున
మొదలు పెట్టి పెక్కింటిని చెప్పి తుదకు ఇట్లనెను. "లోకమున ఏది ఏ
హాత్మ్యమహితమో, శ్రీమంతమో, బలోత్సాహసమన్వితమో అది యంతయ
జము యొక్క అంశమువలననే సంభవించుచున్న దని యెఱుంగుము. లేదా, ఇన్ని
షము లెందులకు ? ఈ సర్వజగత్తును నాయందలి యొక్క యంశము చే
ఁయున్నాను".

యద్య ద్విభూతి మ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవ వా |
త త్త దేవావగచ్ఛ త్వం మమ తేజో ఽంశ సంభవమ్ || 41

అథవా బహు నైతేన కిం జ్ఞాతేన తవార్జున |
విష్టభ్యా మహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ || 42

శ్రీమహాభారతే - భీష్మపర్వణి - అధ్యా. - 34

ఈ భూతము లన్నియు భగవంతునియొక్క ఒకపాదమే (పాదో ఽస్య విశ్వా
ని - పురుషసూక్తము) అని వేదము చెప్పినట్లు బగవంతుని యందలి యొక్క
మే, అనగా నాల్గవవంతే, విశ్వముగా గోచరించుచున్న దని, అభివ్యక్తము కాకుండ
anifest) ఆయన స్వరూపము ఇంకను మూడువంతులు ఉన్న దని స్పష్ట
మన్నది.

ఈ మహిమాతిశయమును విని అర్జునుడు, "నేను చూడగలుగుదు నేని విభూతి
తమైన నీ పరమేశ్వరరూపమును చూపుము" అని కృష్ణుని ప్రార్థించెను. కౌరవుల
కి ఆయన విశ్వరూపమును ప్రదర్శించె నని అర్జునుడు వినియుండుట వలన తాను
ఆరూపమును చూడ వలయు నని అభిలషించియుండును.

భగవంతుడు పార్థుని ప్రార్థనమును మన్నించి, "చరాచరమైన సమస్త జగత్తున
నీవు చూడదలచుకొన్నది యేదియైనను, ఇక్కడ నాదేహమునందు చూడుము" అ
దివ్యదృష్టినొసంగెను. అట్టిదివ్యదృష్టినే వ్యాసభగవానునివలన పొందిన సంజయుడ
చెప్పినట్లుగా, ఒక్కసారిగా వేయిమంది సూర్యులు పైకివచ్చినచో ఎంత కాం
యుండునో అంతకాంతి భగవంతుని దేహమునుండి బయలుదేరి భూనభోంతరము
యందు వ్యాపించెను. దానియందు అర్జునుడు వేయి బాహువులతో వందలకొల
శీర్షములతో నేత్రములలో ఉదరములలో అన్ని వైపులకు వ్యాపించియున్న
మహోన్నతమైన భగవంతుని రూపమును చూచెను. శీర్షములపై కిరీటములు
హస్తములలో గదాచక్రాద్యాయుధములు కన్పించుచుండెను. చంద్రసూర్యులు ఆయనక
నేత్రములవలె నుండిరి. దంష్ట్రలచే భయంకరములు గానున్న వక్త్రములయందు అగు
జ్వలించుచుండెను. ఆదేహమునందే బ్రహ్మాదిదేవతలను, మహర్షులను సర్పముల
మొదలుగా సర్వభూతములను, ఆ యాలోకముల విభాగములతో, విస్పష్టముగా జగత్తు
అంతయు అర్జునునకు ఒక్కచోటనే కన్పింపజొచ్చెను. అద్భుతము ఉగ్రమునైన
విశ్వరూపమును చూచుచు మూడులోకములు కంపము నొందజొచ్చెను
వసురుద్రాదిత్య గంధర్వయక్షరాక్షసాదుల సంఘములు విస్మితములై ఆయనన
చూచుచుండగా, దేవతలు కొందఱు భీతులై ప్రాంజలులై ప్రార్థించుచుండిరి. మహా
సిద్ధసంఘములు "స్వస్తి, స్వస్తి" అని పలుకుచు పుష్కలములైన స్తోత్రములతో
స్తుతించుచుండిరి. ఆరూపమును చూచుచున్న యర్జునుడు ధైర్యహీనుడై శాంతి
సుఖమును పొందలేక దిక్కుతకోచక దీను డయ్యెను.

"నీవు చూడదలచుకొన్నది యేది యైనను ఇందు చూడుము" అని భగవంతుడ
ముందే చెప్పియుండెను". మేము జయింతుమో లేక దుర్యోధనాదులే మమ్ము జయింతుర
(యద్వా జయేమ యది వా నో జయేయుః) అని శంకించుచుండిన యర్జునుడ
ఆసమయమున యుద్ధముయొక్క పర్యవసానమును తెలిసికొన దలంచుట సహజము
అందువలన అతని యభిప్రాయమును గ్రహించి భగవానుడు ఆ పర్యవసాన దృశ్యమున
ప్రముఖముగా ప్రదర్శించెను. దుర్యోధనాదులు, భూభారమును తగ్గించుటకై
మనుష్యలోకమున అవతరించిన దివ్యులైన భీష్మద్రోణకర్ణాదులు, పాండవుల పక్షమ
నందున్న మహాయోధులతో కూడ భూపాలసంఘములతో సత్వరముగా దంష్ట్రలతో
భయంకరములైయున్న భగవంతుని వక్త్రములలో ప్రవేశించుచుండిరి. కొందఱ
ముద్దలుగానైన శీర్షములతో దంతములయందు చిక్కుకొనుచుండిరి. మిడుతలు గుంపుల
గుంపులుగా జ్వలించుచున్న యగ్ని యందు వేగముతో వచ్చి దూకునట్లు, వరదలతో
ఉరువడించుచున్న నదులు సముద్రములో పోయిపడునట్లు ; మహావీరు లందఱ
సైన్యవాహినులతో భగవంతుని వక్త్రములయందు జొఱబడుచుండిరి. ఆయన వా
నందఱను మ్రింగుచు చప్పరించుచుండెను.

దీని నంతను చూచుచున్న యర్జునునకు భగవంతుని వక్త్రములయం
వేశించుచున్న వారిలో తాను తన సోదరులు కొందఱు లేకుండుచే జయము తమ
గు నని తెలియుచున్నను, ఇంతమందిని మ్రింగుచున్న యీయన ఎవరు అ
ందేహము ప్రబలమయ్యెను., అందువలన అర్జునుడు భయముతో భక్తితో ప్రణమిల్లుచ
పరమేశ్వరా ! ప్రసన్నుడ వగుము. ఇంత యుగ్రరూపుడవైన నీవు ఎవరు ? ఏమి చేం
గానుకొంటివి ?" అని అడిగెను.

భగవంతు డిట్లనెను. "నేను కాలుడను, లోకక్షయకరుడనై ప్రవృ
ిందుచున్నాను. ఇచ్చట ఈ లోకుల నందఱను హరించుటకు పూనుకొనియున్నా
వు లేకున్నను, ఈ సైన్యములలో యిరువైపుల యందును సన్నద్ధులై నిలిచియున
యోధు లెవ్వరును ఇంక ఉండరు. వీ రందఱు ఇంతకుముందే నాచే నిహతు లైనా
వున నీవు నిమిత్తమాత్రముగా శత్రువులను జయించి సమృద్ధమైన రాజ్యము
ిందుము. లెమ్ము ; యశస్సును పొందుము. నాచేతనే చంపబడిన యీ భీష్మాదుల
ంహరించుటకు వ్యథ యెందులకు ? వీరి నందఱను వధింపుము. నీవే విజేత వగుదువు

భగవంతుడు ఇట్లు చెప్పినను, ఆ యుగ్రరూపమును చూచుచున్న యర్జునున
యము పోలేదు. అతడు వణకుచు అంజలించుచు మాటిమాటికి నమస్కరించుచ
తిచేత మాట తొట్రుపడుచుండగా భగవంతుని అనేక విధముల ప్రశంసించుచ
ర్థించుచు ఇట్లనెను. "ఆదిదేవా! పరమేశ్వరా! అనంతరూప ! ఎదురుగా వెనుక వైపు
న్ని వైపులను నీకు నమస్కరించుచున్నాను. నీ యీ మహిమ నెఱుంగక, "కృష్ణ
ాదవ ! మిత్రమా !" అని నిన్ను లెక్కపెట్టక పొరపాటున గాని స్నేహముచే గా
పహాసము కొఱకు గాని, విహారశయ్యాసనభోజనాదులయందు నీ సమక్షమున గా
రోక్షమున గాని మన్నన లేకుండ చేసిన చేష్టలను పలికిన మాటలను క్షమింపుమ
రాచరమైన యీ లోకమునకు నీవు తండ్రివి, నీ ప్రభావము సాటి లేనిది. కావు
హమును వంచి ప్రణమిల్లి ప్రార్థించుచున్నాను. పుత్త్రుని తప్పులను తండ్రివల
్నిహితుని యపరాధములను మిత్రునివలె ; ప్రియురాలినేరములను ప్రియునివ
దోషములను సహింపుము. అపూర్వమైన నీయీరూపమును చూచుచ
ర్షముతోపాటు భీతిచేత వ్యథను కూడ పొందుచున్నాను. నన్ను అనుగ్రహిం
తుర్భుజములతో ప్రసన్నమైన రూపమును పొందుము".

భగవంతు డిట్లనెను. "అర్జునా ! నీయందు ప్రసన్నుడనగుటచేతనే, నీచేత తప
ంతరు లెవ్వరిచేతను చూడబడని యీ విశ్వరూపమును ఈశ్వరత్వ సామర్థ్యముచే
ప చూపితిని. వేదాధ్యయన యజ్ఞదాన తపస్సంపన్నులైన వారికి కూడ ఈరూపమున
ంచుట శక్యము కాదు. భయము నొందకుము. నీవు కోరుచున్న రూపమునే చూడుము'

ఇట్లనుచు భగవంతుడు సౌమ్యమైన పూర్వరూపమును పొంది అర్జును
ార్చెను. అతడు స్వస్థచిత్తుడైన తరువాత ఆయన మరల ఇట్లనెను. "అర్జునా ! నీవ

చూచిన యీ విశ్వరూపము ఎంతగా తపోదానయజ్ఞాదులను గావించినను దర్శించుట
శక్యము కాదు. అనన్యమైన భక్తిచేతనే నన్ను ఈ విధముగా తెలిసికొనుటక
సాక్షాత్కరించుకొనుటకు, తత్త్వస్వరూపముతో నన్ను పొందుటకు శక్య మగున
నాకొఱకు కార్యములను చేయుచు, నన్నే పరమగతినిగా తలంచుచు నాకు భక్తు
సంగరహితుడై సర్వభూతములందును వైరమును వీడిన వాడు నన్ను పొందును".

## విజయప్రభ

ఇందు గ్రహింపవలసినయంశములు అనేకములు కలవు. శ్రీకృష్ణుడు దివ్యదృ
నొసంగినా డనగా అర్జునుని నేత్రేంద్రియమునకు విశేషమైన శక్తిని తాత్కాలికము
నొసంగి తరువాత దానిని ఉపసంహరించినా డని గ్రహింపవలసియున్నది.

"నన్ను అనుగ్రహించి చతుర్భుజములతో ప్రసన్నమైన రూపమును పొందుమ
అని శ్రీకృష్ణుని అర్జునుడు ప్రార్థించుట మొదటి విషయము. ఆయన అర్జునున
ఎల్లప్పుడును నాలుగు భుజములతోనే కన్పించుచున్నాడా అని సందేహము కలుగు
శ్రీకృష్ణనిర్యాణము తరువాత అర్జునుడు వ్యాసునియొద్దకు పోయి దుఃఖించుచు ఇట్లనె
"అయ్యా ! అప్రమేయాత్ముడు శంఖచక్రగదాధరుడు చతుర్భుజుడు పీతవాసుడు అయి
పురుషుడు ఇంతకు ముందు నారథమునకు ముందు పోవుచు శత్రుసైన్యముల
నిర్దహించుచున్నట్లు కన్పించెడివాడు. ఆ పురుష డిప్పుడు కన్పించుట లే దేమి?" అ
యడిగెను. దీనిని బట్టి యుద్ధములయందు పూర్వము శ్రీకృష్ణుడు చతుర్భుజుడై అర్జున
రథమునకు ముందు రక్షకుడుగా కన్పించుచుండె నన్నమాట. ఇప్పుడు కూడ అ
చతుర్భుజుడవుగా రథముముందు కన్పించుచుండు మని అర్జునుడు ప్రార్థించుచున్నా

దీనినిబట్టి రథమునందు సారథిగా, ఆహారవిహారసమయములందు, శ్రీకృష్ణ
అర్జునునితోపాటు లోకులకు కూడ రెండు భుజములతోనే కన్పించుచుండె నన
స్పష్టము. రథమునకు ముందు చతుర్భుజుడుగా అర్జునునకు మాత్రము కన్పించుచు
నన్నమాట. అప్పు డాయన శత్రుసైన్యములను దహించుచున్నట్లు కన్పించుచుండు
కూడ అర్జునునకు దృశ్యమాత్రముగానే గోచరించుచు అతనికి ఉత్సాహము
కలిగించుచుండెనే కాని సైన్యములకు కన్పించుట లేదు. అట్లు కన్పించిన
సైన్యములయందు హాహాకారములు బయలుదేరి యుండును. అనేక బాహువుల
నేత్రములతో భయంకరమైన రూపముతో సైన్యమునకు ముందు కూడ కన్పిం
నాలుగు భుజములతో తనకు కన్పించుచుండు మని అర్జునుడు శ్రీకృష్ణ
ప్రార్థించుచున్నాడు. రెండు బాహువులు కలిగిన శ్రీకృష్ణునిరూపముకంటె నాలు
బాహువులరూపమే అర్జునునకు మనోహరముగా నుండె నని గ్రహింపవలసియున్న

కృష్ణార్జునులు ఇరువురు రథముపై కూర్చుండియే మాటాడుకొనుచున్నా
ేథమునకు వెనుకభాగమున అర్జునుడు విషాదముతో కూర్చుండె నని (రథో:
ఃపావిశత్)ముందే చెప్పబడియున్నది. సారథియైన కృష్ణుడు కూడ కూర్చుండి
యుండెను. విశ్వరూపమును చూపునప్పుడు ఆయన లేచినిలుచుండి సంరభ:
ొందినట్లు చెప్పబడలేదు. కావున ఆయన ప్రశాంతముగ కూర్చుండి
ంకల్పమాత్రమున ఆరూపమును సృష్టించె ననుట స్పష్టము. చలనచిత్ర యాంత్రికు
Cinema Operator) మీట నొక్కినంతనే చిత్రప్రసారము జరుగునట్లు భగవాను
ంకల్పము గావించినంతనే అనాయాసముగా ఆయనయందే విశ్వరూప చిత్రప్రసార:
రిగెను.

వివిధదేశముల యాకృతులను, వానియందు ప్రముఖములైన నదీనదసము
ర్వతారణ్య విశేషములను, నగరములను ప్రభుత్వాధినేతలను రేఖలతో ప్రపం
త్రపటమును ప్రదర్శించుట ఎట్టిదో విశ్వరూప ప్రదర్శనము కూడ అట్టిదే. దీనియం
విధలోకములతో, లోకపాలకులతో ఆ లోకములలో నివసించు దేవదాన
క్షరాక్షసాది సంఘములతో విశ్వముయొక్క ఆకృతి సంక్షేపముగా ప్రదర్శింపబడుట
క, అది యంతయు భగవంతునియందే ఉన్నట్లు చూపబడెను. దీనివలన భగవంతు
శ్వమయుడు, విశ్వ మంతయు ఆయనయందే యున్నది ; ఆయనకంటె భిన్నమై
దార్థము (Matter) పరమాణువు కూడ లే దను విషయము స్పష్టముగ గోచరించున

|| హరిమయము విశ్వ మంతయు
హరి విశ్వమయుండు సందియము పని లే దా
హరిమయము కాని ద్రవ్యము
పరమాణువు లేదు లోకపావన వింటె — ఆంధ్రభాగవతమ

విశ్వరూపమున అర్జునుడు భయంకరదృశ్యములను చూచుచు భీతుడ
వ్యథితుడును అయ్యె నన్నచో భగవత్స్వరూపము కేవలము ప్రసన్నమై
మా మూర్తియే కా దని మహోగ్రమూర్తియు అగునని సృష్టిలో
హా భయంకరములైన సర్ప వ్యాఘ్రసింహాదులు, అమితక్రూరులైన యసురరాక్షసాదుల
డ భగవద్రూపములే యని, సృష్టివలె, స్థితివలె, ప్రళయ మొనర్చుట కూడ ఆయ
యే అని గ్రహింపవలసియున్నది. నాటకమునందు శృంగార దృశ్యములతోపాట
ణాత్మకములు భయానకములును అయిన దృశ్యములను కూడ చూచుచ
ష్టింటియందును రసమునే ఆస్వాదించుచు తన్మయత్వమును పొందుప్రేక్షకునివ
వత్స్వరూప తత్త్వమును ఎఱింగిన జ్ఞాని సకలవిశ్వమును వివిధరసాత్మకమై
హానాటకమువలెనే చూచుచు ఆనందించుచుండును.

భీష్మాదులు ముందే నిహతులై యున్నారనుట వలన, వా రందఱు, భోగాలము
పురించి, కాలవశమున తేజోహీనులై మృతప్రాయులై యున్నా రని గ్రహింపవలె.

"అర్జునా నీవు నిమిత్తమాత్రుడవే అగుము" నిమిత్త మాత్రం భవ సవ్యసాచి శ్లో. 33) అని భగవానుడు నిర్దేశించుటవలన, "కాలవశమున భీష్మాదులను జయిం గలుగునప్పుడు నీవు ఎట్లు నిమిత్తమాత్రుడవో, దైవము ప్రతికూలమై నీ ఓడింపబడునప్పుడు కూడ నీవు నిమిత్తమాత్రుడవే, కావున జయమునకు ప్రహర్షము పరాజయమునకు విషాదమును పొంద నక్కఱలే" దని భగవానుడు సూచించుచున్నా

"ఉగ్రమైన యీరూపమును ఉపసంహరింపుము ; సౌమ్యమైన రూపము కన్పింపుము" అని అర్జునుడు ప్రార్థించె నన్నచో జ్ఞానులు తప్ప సామాన్యులు సృష్టిలో భయంకర దృశ్యములయందు కూడ ఆనందమే యైన భగవత్స్వరూపమును గ్రహిం లే రని స్పష్ట మగుచున్నది. భృగుమహర్షి తపస్సు చేసి జగత్కారణమైన బ్రహ్మం ఆనందమే అని తెలిసికొనెను. (ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్ - తైత్తిరీయము)

"నే నిప్పుడు ప్రసన్నుడనై నీకు చూపిన యీరూపమును ఇతరు డెవడు చూచియుండ లేదు". (త్వ దన్యేన న దృష్టపూర్వమ్ - శ్లో. 47) అని భగవానుడు చెప్పు గమనింపదగియున్నది. మఱి ఆయన ఇంతకుపూర్వము కౌరవసభలో విశ్వరూపము చూపియుండలేదా ? నిజమే. కాని ఆరూపమునకు దీనికిని భేదము చాల కల దానికంటెను ఇది అనేకవిధముల ఉజ్జ్వలము, సమగ్రము. అందువలన ఈ విశ్వరూపమును ఇతరు లెవ్వరును చూచియుండ లేదనుట యథార్థమే.

"సకల భూతములయందు ఎవడు వైరభావరహితుడై యుండునో వాడు నన్ను పొందును" అని భగవానుడు చెప్పుటవలన భగవద్భక్తుడు తనకు అపకారకము భూతములయందు కూడ భగవత్స్వరూపమునే భావించుచు, వ్యవహారమునం ధర్మమును మాత్రమే అవలంబించి శిష్టరక్షణము దుష్టశిక్షణము చేయుచుండవలయు స్పష్టమగుచున్నది.

అర్జునునకు ధ్యానయోగమునందు ప్రబలమైన యాధారము ఉపయోగపడుటకు విశ్వరూపమును ప్రదర్శించినను, అది మహోజ్జ్వలమై దృశ్యమాత్రమే కాని తన యథార్థమైన రూపము కా దని తన తత్త్వమును భగవాం ముందే స్పష్టముగా నిరూపించియున్నాడు. తన విభూతి విశేషములను చెప్పుట ప్రారంభించినప్పుడు మొదటనే ఆయన తనస్వరూపమును ఇట్లు నిరూపించెను. "స భూతములయొక్క హృదయములందున్న ఆత్మను నేను. భూతములకు ఆది, మధ్య అంతము నేనే".

శ్లో॥ అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయ స్థితః।
అహ మాది శ్చ మధ్యం చ భూతానా మంత ఏవ చ॥

అధ్యాయః - 34

